శ్రీ శ్రీశ్రీ వ్యాసం గుండె ప్రతిధ్వని, వ్యాసం చదవటం ముగించినా ఆ చప్పుడు ఆగిపోదు. అది గింగురుమంటూ ఉంటుంది. ఆ ప్రతిధ్వని రచయితకు ప్రముఖ స్థానం ప్రసాదించింది.

శ్రీ నార్ల వేంకటేశ్వరరావు తాత్త్వీక జీవితం జీవించవలసిన మేధావి. పత్రికా రచయితగా రూపొందటం అతిచిత్ర జీవితస్థితి, 'పిచ్చాపాటి' 'మాటామంతీ' (1951) వ్యాస సంపుటులలో హృదయవాది అయిన మేధావి జీవితం వ్యాఖ్యానింపబడినట్టు తోస్తుంది. సంపుటాలుగా ముద్రింపబడక పూర్వం ఆంధ్రప్రభలో వెలువడ్డ ఈ వ్యాసాలు, వ్యాసం ప్రక్రియగా ఉన్నతశిఖరం అధిరోహించటానికి దోహదం చేశాయి.

శ్రీ నార్ల వ్యాసాలలో వాతావరణం తెలుగుదేశపు నడిబొడ్డులోని పల్లెటూరు; భాష తెలుగుదనం, నుడికారం, పలుకుబడి పుణికిపుచ్చుకొన్న అచ్చమయిన -స్వచ్ఛమయిన కన్నతల్లిలాంటి-ఆవు పెరుగులాంటి - ఆవకాయలాంటి వ్యావహారికం; విషయం నిత్యజీవిత సత్యం, నిరంతరాన్వేషణం; వ్యాసవాక్యం, తెలుగువాడి గుండె వాడిదనం తెలుగునాటి మేటితనపు ప్రతిరూపం. ఈ వ్యాసాలు మేధావి అయిన ఆంధ్రుడి ఆలోచనలకు హృదయాభివ్యక్తికి అక్షర రూపాలు. ఈ వ్యాసాలలోని ప్రధానగుణమయిన సంక్షిప్తత పాఠకుడి నాడిని వీణ తీగలాగా మీటుతుంది. ఒక వాక్యంలో ఒక వ్యాసాత్మ భద్రం చేసినంత సంక్షిప్తంగా వాక్య విన్యాసం ఉంది.

విషయం ఎంత బరువయినదయినా వ్యాసరచనంలో సృజనగుణం తగ్గలేదు. ఈ వ్యాసాలలో అనవసర భావంకాని పదంకాని వాక్యంకాని గోచరంకావు. ఆనందోద్దిష్టరచనలైన ఈ వ్యాసాలు ఆలోచన బరువుతోనుండి సృజనాత్మకత నిలుపుకొని తెలుగుసాహిత్యంలో ఉత్తమంగా వెలిగాయి. ఈ వ్యాసవిషయం ప్రముఖంగా సాంఘికం, కాని సారస్వతాది అన్యవిషయ విన్యస్తంగా వ్యాసాలు లేకపోవచ్చు. ఆంగ్లవ్యాసధర్మం అనుష్ఠించుకొన్న ఈ వ్యాసాలకు రచయిత శైలి వ్యక్తిత్వం ప్రాణభిక్షపెట్టి, వీటిని వ్యాసవాఙ్మయంలో అగ్రశ్రేణిలో నిలిపాయి.

మొక్కపాటి నరసింహశాస్త్రి - బారిష్టరు బాతాఖానీ (1954) సాక్షి పదరుబోతుల సంప్రదాయంలో సాగిన వ్యాససంపుటి. ఆంధ్రుడు పరదాస్య



శృంఖలా బద్ధుడనీ, సంక్రాంతి ఆనంద సంకేతమనీ, అలక్ష్యం ఆంధ్రత్వమనీ, కవిపండితుల ఉపన్యాసాలు జనానికి చావుగా ఉన్నాయనీ, గొప్పలు చెప్పుకోవడం మానవ నైజమనీ, డబ్బూ ప్రసిద్ధీకోసం ప్రాకులాటలు అధిక్షేపిస్తూ ఈ వ్యాసాలు అవతరించాయి. ఈ సృష్టి జారి అవలక్షణాలను అవహేళనం చేయటంగా రూపొందింది. ఆంధ్రత్వం అధిక్షేపానికిగురైనా రచయిత విశాలదృక్పథం జాత్యభ్యుదయ వాంఛ స్పష్టంగా పరికింపవచ్చు.

మునిమాణిక్యం నరసింహారావు - 'ఇంటావిడతో పోట్లాట' (1957) 'ప్రణయ కలహం' సృజన వ్యాసాలు. వీటిలో హృదయస్ఫూర్తితోపాటు కోమలాభివ్యక్తిఉంది. హాస్యంతోపాటు రసార్ద్రదృష్టిఉంది. విషయవివరణం వినోదాత్మకంగా ఉంది.

శ్రీ తిరుమల రామచంద్ర - 'నుడి-నానుడి' (1963) భాషాపరంగానూ 'సాహిత్య సుగతుని స్వగతం' భాషాసారస్వత గతంగానూ ఉన్న . వ్యాససంపుటులు రచనలలో సృజనగుణం వస్తువులోని విమర్శనతత్త్వాన్ని అధిగమించింది. పత్రికా సంపాదక పదవిలోఉండి ఆంధ్రప్రభలో భారతిలో ఈ వ్యాసాలువ్రాసి ప్రచురించటం కొంత ఉద్యోగధర్మం అయినా చాలావరకు సారస్వతధర్మమే నిర్వహణ పొందింది. ద్రావిడ భాషావేత్తగా సంస్కృత ప్రాకృతాంగ్ల పాండిత్యంతోపాటు భాషా పరిశోధనంకూడా నిరంతరం పెంచుకొంటూ బరువయిన భాషావిషయాలు సృజనవ్యాసాలలో నిక్షిప్తం చేసిన శ్రీ తిరుమల రామచంద్ర ఎన్నదగ్గ వ్యాసస్రష్ట.

శ్రీ సంజీవదేవ్ - 'రసరేఖలు' (1963) తేజోరేఖలు (1965) వ్యాస సంపుటులు. అస్తవ్యస్తంగా క్రమ రహితంగా ఉన్న ఆలోచనలివి. ఇవి విజ్ఞానం మాత్రమే కాక వినోదం కూడా అందించే ఉద్దేశంతో వెలువడ్డాయి. చిత్రలేఖనం ప్రధాన వస్తువుగా అనుభూతి మాధుర్యంలో వ్యాసావిష్కృతి జరిగింది.

శ్రీ టి. భాస్కరరావు - 'స్ఫూర్తిశ్రీ వ్యాసావళి'. (1965) 'మాటలంటే మాటలా?' 'మాటలతో మంతనాలు' సృజనవ్యాసాలు. భాషాశాస్త్ర సంగతులు వ్యాకరణం పరిశోధించే వ్యాసకర్త బరువయిన విషయరచనం సృజనంగా ఉంది.

కాటూరి వేంకటేశ్వరరావు – 'సాహిత్య దర్శనము' లో కవి ఆలోచనలకు, పరిచయమున్న వ్యక్తులకు, తెలిసిన సన్నివేశాలకు చోటుంది. కవి,

వ్యాసకర్త అయినప్పుడు ఆలోచన సాగినమార్గంలో రచనవెళ్ళి క్రమతలోపించి సృజనాత్మక పెరిగింది. పఠనయోగ్యత పెంచుకొన్న వ్యాసాలివి.

బుచ్చిబాబు కల్పనాత్మక సాహితీ నిర్మాతలలో మేధావి. వ్యాసకర్తగా కంటే నవలా కథానికా నాటికా రచయితగా ప్రసిద్ధి పొందినవ్యక్తి. ఆంధ్ర జ్యోతిలో వెలువడ్డ 'అంతరంగమథనం' 'నన్నుమార్చిన పుస్తకం' వ్యాస సంపుటాలు. అంతరంగమథనం జీవితకథా వ్యాస పరంపరగా సాగి సాగి ఆగిపోయింది. తన జీవితంలోని సంఘటనలకు అభివ్యక్తి నిచ్చిన బుచ్చిబాబు హృదయవాది. కవుల రచయితల పరిచయం కూడా విమర్శనంగా చేయలేదు. ఉత్తమ సృజన సాహిత్యం చదివితే మనస్సు పొందే ఆందోళన ఉపశమనం బుచ్చిబాబు వ్యాసాలు చదివితే కలుగుతుంది.

డా॥ బోయి భీమన్న 'ఏకపద్యోపాఖ్యానము, సవ్యాఖ్యానము, సాహిత్య వ్యంగ్యరచన' (1969) అధిక్షేపవ్యాసం. ఇది ఆధునిక సాహిత్యంలోని వ్యాఖ్యాన విమర్శన విధానంమీద చెర్నాకోలదెబ్బ, ఇది చదివి విమర్శకుడు ఆత్మవిమర్శ చేసుకోకుండా ఉండలేడు.

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు 'సాహిత్య ప్రయోజనము' (1969) వ్యాస సంపుటిలో విషయం సారస్వతమయినా రచనం విమర్శనమయినా, ఆవిష్కృతి హార్దికం. సాహిత్యం సాంఘిక ప్రయోజన రమ్యంగా ఉండాలని ఆశించిన హృదయవాది ఆలోచన లీవ్యాసాలు.

డా॥ పి. సీతారామారావు - 'మృగయా వినోదం' (1970) వేటకు సంబంధించిన వ్యాసాల సంపుటి. వీటిలో అడవి మృగాలను వేటాడేవాళ్ళ జీవితం - ఆధునిక సమాజనేపథ్యం నుంచి పరిశీలించి - చిత్రించటం జరిగింది. వ్యాసాలు చదువుతున్నంతసేపు లోకాంతరంలో సంచరిస్తున్న అనుభూతి కలుగుతుంది. భయం ఆందోళనలు కలిగి చనిపోయే జంతువులమీద ప్రేమపుట్టి వ్యాసాలు హృదయ పరిధీ ప్రవర్తకాలయ్యాయి.

ఇంకా పలువురు సృజన వ్యాసకర్తలు వ్యాస సారస్వతం సుసంపన్నం కావిస్తున్నారు. శ్రీ అమరేంద్ర - 'భావవీణ', శ్రీ సోమంచి యజ్ఞన్న శాస్త్రి - 'ఎణ్ణిబేపు', శ్రీ దరిశి చెంచయ్య - 'నా దివ్య స్మృతులు' వంటివి అనేకం ఉన్నాయి. వర్తమానంలో అనేకం సృజన వ్యాసాలు అవతరిస్తున్నాయి. కల్పనాత్మక సాహిత్యంలో సమానంగా నిలువగల సృజన వ్యాససృష్టి ఆధునిక యుగంలో, వెనుకబడిందని చెప్పవచ్చు.



## 1:2. స్త్రీ వ్యాసం

శాస్త్ర చర్చకంటే కళాభావన స్త్రీ హృదయ సన్నిహితంగా ఉంటుంది. కళాసృష్టిలో స్త్రీకి ఉన్నంత అభినివేశం సాధారణంగా శాస్త్రదర్శనంలో ఉండదు. స్త్రీల వాఙ్మయం ఎక్కువగా హృదయ సంకేతంగా ఉంటుంది. స్త్రీలు లలిత కళా నిర్మాణం చేసినంతగా శాస్త్రలోకంలో సంచరించలేరు కాబట్టి వ్యాస వాఙ్మయంలో స్త్రీల సృష్టి సామాన్యంగా సృజనంగానే వుంటుంది.

ఆంగ్ల విద్యలో స్త్రీ జీవితానికి పునరుజ్జీవనం వచ్చిందని చెప్పవచ్చు. ప్రపంచంలో, భారతదేశంలో వస్తున్న స్త్రీ స్వాతంత్ర్యకాంక్ష ఆంధ్రదేశంలోనూ సాగింది. దేశ స్వాతంత్ర్యంతో స్త్రీ జీవితానికి నవయుగోదయమయింది. ఈ యుగంలో స్త్రీ లోకంలో నూతన్న చైతన్యం వచ్చింది. ఆర్థికంగా రాజకీయంగా సాంఘికంగా వచ్చిన మార్పులు స్త్రీల ఆలోచనలకు అనుభూతి అభివ్యక్తికి దోహదం చేశాయి. 'స్త్రీలు నేడు సారస్వతాకాశంలో తారలు లాగా ప్రకాశించే వాళ్ళు చాలమంది ఉన్నారు. వీళ్ళలో వ్యాససృష్టి చేస్తున్నవాళ్ళూ పలువురున్నారు.

కందుకూరి కాలంలో ప్రోత్సాహం పొంది స్త్రీలు ఉపన్యాస సృష్టి కావించారు. వేదికల మీద ఉపన్యసించారు. బండారు అచ్చమాంబ, కొటకలపూడి సీతమ్మ, పులుగుర్త లక్ష్మీనరసమాంబ వంటి రచయిత్రులు స్త్రీల విద్య, సాంఘిక నియమాలు, బాల్య వివాహం, వితంతువివాహం వంటి భిన్నవిషయాలు గ్రహించి వ్యాససృష్టి చేశారు. చేయించారు. ఉపన్యసించారు. ఉపన్యాసాలు ఇప్పించారు.

నేటి రచయిత్రుల వ్యాసాలు కష్టాలు తొలిగించుకోవటంతో పాటు ఇష్టాలు కలిగించుకోవటం, నష్టాలు వదిలించుకోవటంతో పాటు అభిమతాలు పదిలం చేసుకోవటంగా రూపొందాయి. నవలా కథాది సృజన ప్రక్రియలు ఆదరించినంతగా వర్తమాన స్త్రీలు వ్యాసం ఆదరించకపోయినా అసలు ప్రయత్నం చేయకుండా ఉండలేదు.

శ్రీమతి లత వ్యాసంలోకి కవితాధర్మం చొప్పించిన రచయిత్రిగా చెప్పవచ్చు. 'ఊహాగానం' సంపుటాలు 'లత వ్యాసాలు' ఈ ధర్మం ప్రస్ఫుటంగా

చూపుతున్నాయి. ఇంతకంటే ముందుగా గృహలక్ష్మి పత్రికలో సృజనధర్మ ప్రచురంగా వ్యాసస్పష్టి చేసిన శ్రీమతి కొత్త లక్ష్మీరఘురామ్ కృషి సారస్వత లోకం గమనించిన విషయం !

నేడు ప్రతి పత్రికలోనూ - చాలావరకు - స్త్రీల శీర్షిక ఒకటి వుంది. స్త్రీలకే పత్రికలు వెలిశాయి కూడా. ఈ శీర్షికలలో స్త్రీల సమస్యల మీద వ్యాసాలు అనేకం ఆవిర్భవించాయి. కట్టు కుట్టు బొట్టులు దగ్గర్నుంచి మతాంతరవివాహాలు దేశాంతర రాజకీయాలు దాకా చర్చిస్తూ వ్యాసరచన చేస్తున్నారు స్త్రీలు.

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో శ్రీమతి మాలతీచందూర్ నవలలను గూర్చి నవలల సమస్యలను గూర్చి వ్యాసస్పష్టి చేస్తున్న సంగతి అవగత పూర్వమే! ఆంధ్రపత్రికలో శ్రీమతి కె. రామలక్ష్మి స్త్రీల సమస్యలను, నారీ దృక్పథాన్ని వివరించే వ్యాసాలు వ్రాస్తున్న విషయం సుపరిచితం! ఈ రచయిత్రి "దారి చూపిన దీపకళికలు" వ్యాససంపుటిలో స్వాతంత్ర్యానికి పూర్వం మహిళోద్యమం నడిపిన స్త్రీల జీవితచరిత్ర గోచరమవుతూవుంది.

శ్రీమతి న్యాపతి కామేశ్వరి ప్రసంగ వ్యాసాలు, ఆకాశవాణిలో ప్రసారమయిన స్త్రీల ప్రసంగ వ్యాసాలు, స్త్రీల గృహ సాంఘిక దృష్టిని వివరిస్తున్నాయి. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ సారస్వత జీవిత చరిత్ర వ్యాసాలు, డా॥ నాయని కృష్ణకుమారి, డా॥ యశోదారెడ్డి పరిశోధన వ్యాసాలు విమర్శన గుణభారంతో శోభిస్తున్నాయి.

స్త్రీ వ్యాసస్పష్టిలో అత్యుత్తమ శిఖరాలు చేరుకొన్న రచయిత్రి శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. 'జీవన సామరస్యం', 'నారీజగత్తు', 'వెలుగుదారులు', 'జీవితరత్నాలు' ఉత్తమ వ్యాససంపుటాలు. స్త్రీ జీవితం సంపూర్ణంగా అభివృద్ధి చెందాలని అన్ని రంగాలనుంచి మేలు జరగాలని వాంఛించి తత్సాఫల్యానికి తీవ్ర కృషి చేసి ఈ వ్యాసస్పష్టి కావించినట్టు స్పష్టమవుతుంది. స్త్రీ సమస్యలకు పరిష్కారం ఈ రచయిత్రి ఆలోచించినంత లోతుగా ఎక్కువగా పూర్వం - ఆలోచించినవాళ్ళు లేరనవచ్చు.

## 1:3. పత్రికా వ్యాసం

సృజనధర్మ సమంచితంగా పత్రికలలో వివిధ వ్యాసాలు ప్రచురితమవు



తున్నాయి. విమర్శన వ్యాసాలు కూడా వెలువడుతున్నాయి. కాని వాటికీ తావులో సంభావనం లేదు. సంపాదకీయాలు, ప్రత్యేక శీర్షికలు, సమీక్షలు వ్యాసాలుగా పత్రికా ప్రపంచంలో గోచరమవుతున్నాయి.

సంపాదకీయం సంపాదకుడి హృదయానికి ఛాయాచిత్రం. సంఘటనో వార్తో సమస్యో గ్రహించి, సంపాదకుడి హృదయం పొందిన పరిణామానికి ప్రతీక సంపాదకీయం. అందువల్ల దానికి సృజనధర్మం సంక్రమించింది. ముట్నూరి కృష్ణారావు, కాశీనాథుని నాగేశ్వరరావు సంపాదకీయాలు వ్యాసాలుగా గుర్తింపు పొందాయి.

రాజకీయ సాంఘికాది సమస్యలకు ప్రాతినిధ్యం వహిస్తూ పత్రికలలో సంపాదకీయాలున్నాయి. పత్రికా స్థాపనంలోని ప్రధాన లక్ష్యాన్ని ఆ యా సంపాదకీయాల స్వరూప స్వభావాలు నిర్ణయిస్తూ ఉన్నాయి. అందువల్ల సంపాదకీయం పత్రికాధిపతి అవసరంగానూ, సంపాదకుడి జీవిత ప్రతిబింబంగానూ ఉండి సాహితీ జీవితం పొంది వ్యాసవాఙ్మయంలో భాగమయింది.

*ప్రత్యేక శీర్షిక :* ఒక పత్రికలో సంపాదకుడో ఉపసంపాదకుడో ఒక నియమితుడైన రచయితో రచయిత్రో ప్రతి సంచికలోనూ వుండే ప్రత్యేక శీర్షికను కొంతకాలం నిర్వహించటం నేటిపత్రికా ప్రపంచంలో సామాన్యంగా ఉంది. మాణిక్యవీణ ఇటువంటి రచనకు ఉదాహరణంగా చూడవచ్చు. సృజన సాహిత్య రచనా సామర్థ్యం ఉన్న వ్యక్తి పత్రికా నిర్వహణపు ఒత్తిడిలోనో, ఆ రోజు ఆ పత్రికకు ఆ రచన చేరాలన్న తొందరలోనో, ఈ శీర్షికను పోషిస్తున్నట్లు గుర్తింపవచ్చు. వీటిలో విషయం కంటె రచనం ప్రధానంగా ఉంటుంది.

ఈ ప్రత్యేక శీర్షికలు రచయితల వ్యక్తిత్వ ఫలితాలు. హృదయం కన్న బిడ్డలు. ఈ రచనల సృజనగుణం శోభితం. భాష జీవితం దగ్గరగా ఉంది. హాస్యంకాని, కవితాగుణంకాని అంతర్వాహినిగా ఉంది. సామాజిక సమస్యలు ఈ శీర్షికా వ్యాసంగానికి వస్తువులుగా రూపొందాయి. ప్రతిరోజో ప్రతివారమో ఈ విధమయిన శీర్షికా నిర్వహణం రచయిత సామర్థ్యానికి గీటురాయి.

ఈ యుగంలో పత్రికలలో ఇటువంటి ప్రత్యేక శీర్షికలను ఎందరో ప్రసిద్ధులు నిర్వహించారు. శ్రీ దాసు వామనరావు ఆంధ్రపత్రికలో నిర్వహించిన

'ఇష్టాగోష్ఠి' 'కాలక్షేపం' అందులోనే శివలెంక శంభుప్రసాద్ సాగించిన 'పడక్కుర్చీ కబుర్లు' 'తెలుగు వెలుగులు', శ్రీ ప్రవీణ్ - 'రాజధాని కబుర్లు' సాహితీ జీవితం పొందాయి. కృష్ణాపత్రికలో 'వడగళ్ళు' ఆంధ్రప్రభలో 'ఆషామాషీ' చాలాకాలం వ్రాసిన శ్రీ రావూరి సత్యనారాయణ సామర్థ్యం సాశ్చర్యంగా పరికింపవచ్చు.

ఈ విధంగా ప్రత్యేక శీర్షికా నిర్వహణం చేసిన వాళ్ళలో విభిన్న దృక్పథాలు చూపిన వ్యక్తి విద్వాన్ విశ్వం. ఆంధ్రప్రభలో ఆంధ్రజ్యోతిలో 'తెలుపు నలుపు' 'అవీ-ఇవీ' 'ఇవాళ' 'వారం-వారం' 'మాణిక్యవీణ' విషయంలోను రచనంలోను గుణంలోను తత్త్వంలోను ఉత్తమ వ్యాసాలుగా గోచరమయ్యే శీర్షికలు.

ఆంధ్రజ్యోతిలోనే శ్రీమతి 'పురాణం సీత' 'ఇల్లాలి ముచ్చట్లు' తెలుగు నుడికారం సొంపు, వాడిదనం నిలుపుకొన్న శీర్షిక. శ్రీమతి లత 'ఊహాగానం' లో సృజనగుణం గోచరమవుతుంది. దిన వార పత్రికలలో ఎక్కువగా ఈ ప్రత్యేక శీర్షికా నిర్వహణం జరిగి, ఇటువంటి వ్యాససృష్టికి అవకాశం పెరుగుతూవుంది.

ప్రత్యేక శీర్షికలు హృదయ ప్రతిబింబాలు. ఆంగ్లంలో ఇటువంటి రచనలు అందమయిన వ్యాసాలు. ఆంధ్రంలో వీటిని వ్యాసాలనుకోవటం కొత్తదృష్టి. వీటిలో హాస్యం, సారళ్యం, వైశద్యం, కవితాగుణం ప్రథమగణ్యాలు. సృజన హృదయం ఆవేశం పొందినప్పుడు కలిగిన అక్షరరూపాలీ వ్యాసాలు.

**సమీక్షలు :** దేశంలో ఏ మూలనో వెలువడ్డ ఏ గ్రంథమయినా అందరికీ తెలియటానికి, ఆ గ్రంథాన్ని పరిచయం చేయటానికి ఉద్దిష్టమయిన పత్రికా శీర్షిక సమీక్ష. ఈ సమీక్షను పూర్వం కృతివిమర్శనం అన్నప్పటికీ నేడు పుస్తక సమీక్ష అనో గ్రంథసమీక్ష అనో పిలుస్తూ సమీక్షగా పేర్కొంటూ ఉండటం జరుగుతూవుంది. కావ్యగుణం సమగ్రంగా సమీక్ష వివరించదు కాబట్టి, ఆ ప్రయత్నం కూడా ఉండదు కాబట్టి సమీక్ష సృజనవ్యాసంగా గ్రహింపబడుతుంది. సమీక్షకుడు ఒక కావ్యం చదివితే ఏమి అనుభూతి చెందితే అదే సమీక్ష అవుతుంది. అది బృహత్ ప్రణాళికతో ఉండదుకాబట్టి సమీక్షగా సృజనవ్యాసంగా గ్రహించటమే సమంజసం.

సమీక్ష పూర్తి విమర్శనం కాదు, కృతిసౌందర్యం సంపూర్ణంగా విశదం



చేయదు. పూర్తి పరాశ్రయంగా ఉండదు. సమీక్ష సాధారణంగా కృతిని వివరించేదిగా, అందులోని కొన్ని భాగాలు ఉదాహరించేదిగా, కొన్ని అంశాలు విశదీకరించేదిగా, తత్స్థానం తెలిపేదిగా, గుణదోషాలు పరిశీలించేదిగా అనువాదమయితే అది ఎలా జరిగిందో చూసేదిగా, ఆమోదయోగ్యంగా ఉందో లేదో వివరించేదిగా, సాగుతూ వుంది. భారతి, ఆంధ్రపత్రిక, ప్రభ, జ్యోతి, ప్రగతి వంటి అనేక పత్రికలలో సారస్వత సమీక్షలు వెలువడుతున్నాయి. క్షేమేంద్ర, మనోరాణి, అవంతి, అయాస్య, సుమన, పాపవంటిపలువురు గ్రంథసమీక్షలుచేస్తున్నారు.

ఆంగ్లంలో గ్రంథసమీక్షలు వ్యాసాలుగా రూపొందాయి. ఆంధ్రంలో అది వాంఛనీయ పరిణామంగా ఉంది. వ్యాస వాఙ్మయం పెరగటానికి ఈ సమీక్షా రచన విస్తృతం కావటం అవశ్యం కోరదగ్గ పరిణామం.

***సంచికలు-సంకలనాలు :*** ఒక ప్రత్యేక సందర్భంలో ఒక ప్రత్యేక విషయగతంగా పలువురు వ్రాసిన వ్యాసాలు కలిపి ముద్రించిన సంచికలు, ఒక ప్రత్యేక సందర్భంలో బహు విషయగతంగా అనేకులు వ్రాసిన వ్యాసాలు కలిపి ముద్రించిన సంకలనాలు తెలుగులో మొదటినుంచీ వెలువడుతున్నాయి.

సంచికలు సాధారణంగా ఆయా అవసరాలకు అవతరించటం పరిపాటి. చారిత్రక ప్రసిద్ధికాని, సారస్వత ప్రతిష్ఠకానీ వీటి ఆవిర్భావానికి హేతువు అయింది. కవి పండిత రచయితల సమ్మానం కోసంగాని, సారస్వత పోషకుడి నీరాజనంగా కాని ఇవి అవతరించాయి. సాహితీమూర్తులు సంఘసేవకులు గౌరవం పొందినా, గతించినా, ఇవి వెలువడ్డాయి. ప్రసిద్ధుల జయంతికో వర్ధంతికో కూడా ఇవి పుట్టాయి. సారస్వత సంఘాల నాటక సమాజాదుల ప్రారంభోత్సవంలోనో, వార్షికోత్సవంలోనూ సంచికలు పుట్టాయి. ఒక సంచిక సాధారణంగా ఆంధ్రజాతి జీవితంలో ఒక చిన్నఘట్టం ఆలోచన, చర్య, వ్యాసగతంగా వివరించేదిగా ఉంది.

సంచికలు ఆరంభంలో చారిత్రక దృష్టితో అవతరించి వ్యాసవాఙ్మయం పరిపుష్టం కావించాయి. సాహిత్యం, రాజకీయం, సాంఘిక జీవితం అనంతరం సంచికా విషయాలయ్యాయి. వ్యక్తుల భాషా సారస్వత సాంఘికసేవ ఇటువంటి సంచికలలో ప్రాధాన్యం వహించింది. ఇటువంటి సంచికలు నేడు అనేకం వెలువడుతున్నాయి.

ఈమధ్య వ్యాస సంకలనాలు ఎక్కువయ్యాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వెలువరించిన 'సాహిత్యోపన్యాసములు'లో నన్నయ్య దగ్గర్నుంచి కాశీనాథుని నాగేశ్వరరావుదాకా ఉన్న పదిమంది సారస్వతకృషిని వ్యాసనిక్షిప్తం కావించటం జరిగింది. సారస్వత వ్యాసములు నాలుగు సంకలనాలలో ప్రాచీన పత్రికా వ్యాసాలు ప్రముఖంగా నిలిచాయి. ఆంధ్ర సారస్వత పరిషత్తు వ్యాస సంకలనాలు కావించింది. భారతోపన్యాసములు భాగవతోపన్యాసములు ఉత్తమ వ్యాస సంకలనాలుగా వెలువడ్డాయి.

హైద్రాబాద్‌లో సాహితీ కృషి కావించే 'యువభారతి' ఆధునికులు అనేకాంశాల మీద వ్రాసిన నూరు వ్యాసాలను సంకలనంగా చేసింది. ఇదే సంస్థ 'చైతన్యలహరి', 'వికాసలహరి' వ్యాస సంకలనాలు వెలువరించింది. హైద్రాబాద్‌లోనే ఉన్న 'కళాస్రవంతి' సంస్థ 'సాహితీమంజూష' ను సారస్వత వ్యాస సంకలనంగా వెలువరించింది. కర్నూలు 'సాహితీసదస్సు' - 'సాహిత్యప్రబోధము' వ్యాససంకలనం ప్రచురించింది.

పత్రికలు వ్యాససృష్టికి దోహదం చేశాయి. సృజనవిమర్శన వ్యాసాలు అవతరించాయి. వ్యాసం పత్రికలవల్ల ప్రాచుర్యం పొందింది. ప్రచురణావకాశం పెరగటంతో వ్యాససృష్టి అధికంగా జరిగింది. పత్రికల వల్ల సృజనవ్యాసం విమర్శన వ్యాసం తాకిడికి తట్టుకొంటూ నిలచింది. రెండు విధాల వ్యాసరచనా రీతికి వారధి పత్రిక.

## 1:4. వివాదవ్యాసం

కవులు రచయితలు విమర్శకులు ఆత్మాభివ్యక్తి హృదయావిష్కరణాలతో అనుభూతి పురస్కారంతో అభిమానాందోళనలు ఆవేశాలోచనలు ప్రతిభా పాండిత్యాలు ప్రతిష్ఠించుకొని సాగించిన సారస్వత చర్చలు వివాదవ్యాస సృష్టికి కారణభూతాలు. ఉత్తమ సారస్వతమూర్తులు మానవావసరమయిన సంయమనం కోల్పోవటంవల్ల వివాద విషయమూ రచనామర్యాదా మరుగునపడి సభ్యత సంస్కారం నిర్గమించి, వ్యాసం నిందగా దూషణగా రూపొంది అసహ్యమయ్యే ప్రమాదం ప్రతిక్షణం సాహిత్యం భరింపవలసిరావటం భావ్యం కాదు. మనిషితత్త్వంలోని ఒక ప్రముఖ భాగం ప్రదర్శించేదిగా వివాద వ్యాసం గోచరమవుతుంది.



మంచిచెడ్డల మధ్య స్పష్టంగా లేని మార్గంలో నడిచే సామాన్యుడు ఒక వైపుకు తూలితే వివాదమే ! సాంఘిక వివాదం ప్రమాదకరమే అయినా సారస్వతంలో సంపూర్ణంగా ప్రమాదమే తెచ్చిపెట్టలేదు. వివాద వ్యాససృష్టివల్ల వ్యాసం ఏ విధమయిన భావవ్యక్తీకరణకు వాహిక అయిందో తెలిసి, అందుకూ ఇది సమర్థమయిందన్న గుర్తింపు కలుగుతుంది.

రాజకీయ వాతావరణంలోకి వాదోపవాదాలు ప్రవేశించటంవల్ల సారస్వతం నష్టపోలేదు. ఆంధ్రదేశం కమ్యూనిజం వల్ల కవులయినవాళ్ళు తదన్యులతో సాగించిన వాదోపవాదాలు సాహిత్యవ్యాసాలయ్యాయి. ఈ యుగంలో శ్రీ శ్రీశ్రీని, శ్రీ విశ్వనాథ సత్యనారాయణను సాహితీ రంగంలో చుట్టుకొన్న వివాదం 'ఆంధ్రపత్రిక', 'భారతి' పత్రికలలో వ్యాసావిర్భావానికి దోహదం చేసింది. ఈ వివాద వ్యాసాలు అవతరించిన తీరు, కనిపించిన వ్యక్తిదూషణ అవతల ఉంచి చూస్తే ఇటువంటి వ్యాసాలు జాతి జీవితవిధానానికి వ్యాఖ్యానప్రాయంగా కనిపిస్తాయి.

ఇటువంటివే సారస్వతంలో సంప్రదాయజ్ఞులకు, నవీనులకు; ప్రాచీన కవితాధోరణులకు, నవీనరీతులకు; గ్రాంథికభాషకు, వ్యావహారిక భాషకు; అభ్యుదయకవులకు, విప్లవకవులకు మధ్యవచ్చిన వివాదాలు. ఆయా సందర్భాలలో అవతరించిన వివాదవ్యాస వాఙ్మయం తెలుగు దేశంలో కొంత నూత్నదృష్టిని కలిగించింది.

ఈ శబ్దం సాధువా కాదా అన్న చర్చలు, వాక్యరణచర్చలు, కావ్యచర్చలు చాలా పర్యాయాలు వివాదాన్నే పెంచాయి. పూర్వం ఉన్నంతగా వివాదవ్యాస రచన వర్తమానంలో జరగటం లేదుకాని పూర్తిగా లేకపోలేదు. సమాజ జీవిత పథ నిర్ణయంలో వేగం ప్రసిద్ధంగా ఉన్నంతకాలం వివాదవ్యాసావిర్భూతికి అవకాశం తక్కువ. వివాదవ్యాసం సృజనగుణం ప్రదర్శించి పండిత పామరులలోను ప్రాచుర్యం పొంది తెలుగువ్యాస పరిణామ ప్రదర్శకంగా ఉంది.

తెలుగులో ఈయుగంలో ఉన్న సృజనవ్యాసాలు కవితాధర్మం ఆలోచనపథం ప్రదర్శించాయి. వ్యాసం పూర్వంకన్న చదివేవాళ్ళు ఎక్కువగా కలది అయింది. కొన్ని చారిత్రక వ్యాసాలు ఈ యుగంలోనూ అవతరించాయి కాని వాస్తవానికి చారిత్రక వ్యాససృష్టి దీనికి పూర్వయుగలక్షణం. పలువురు ప్రసిద్ధుల వ్యాసాలు

ఈ యుగంలో ముద్రితాలయినా అవి నిజంగా పూర్వయుగంలోనే వెలువడటం వల్ల ఇక్కడ గ్రహించలేదు. పింగళి లక్ష్మీకాంతం వ్యాససృష్టి 1930 లకు పరిమితంకాని 'నా రేడియో ప్రసంగాలు' ఈ యుగంలో వెలువడింది. ఈ యుగ వ్యాసంలోను, స్త్రీల వ్యాసాలలోను పత్రికా వ్యాససమూహంలోనూ, వివాద వ్యాసాలలోను హృదయం పొందిన ప్రాధాన్యంవల్ల సృజనవ్యాసం ప్రవర్తిల్లింది. ఇక తెలుగువ్యాస వాఙ్మయంలో అధికభాగంగా ఉన్న విమర్శనవ్యాసం పరికింపవచ్చు.

## 2. విమర్శన వ్యాసం

బుద్ధి ప్రధానమై అలోచన రేకెత్తిస్తూనో విషయం బోధిస్తూనో రచయిత హేతు దృష్టినుంచి పుట్టి, అసంపూర్ణ విమర్శనంగా ఉండి, విజ్ఞాన విస్తృతికి దోహదకారిగా రూపొందిన వ్యాసం విమర్శనవ్యాసం. ఇది పదిహేను పథాలలో ప్రవర్తిల్లింది. ఇవి 1 కావ్యతత్త్వ 2 కావ్యాత్మ 3 కావ్యగుణ 4 కవ్యాత్మ 5 కావ్యచరిత్ర 6 జీవితచరిత్ర 7 భాషా 8 అన్యభాషా 9 అనువాద 10 పీఠికా 11 వేదాంత 12 వైజ్ఞానిక 13 రాజకీయ 14 అర్థిక 15 పరిశోధన వ్యాసాలుగా వింగడించి పరిశీలించటానికి తగివున్నాయి.

విమర్శన వ్యాసమే అసలు వ్యాసం అన్నంత ఎక్కువగా ఈ వాఙ్మయం విస్తృతమయింది. విమర్శనంలో విమర్శనవ్యాసం గతార్థమయిపోవచ్చుకాని విస్తృత ప్రణాళికతో విమర్శనం ఉంటే పరిమిత పరిధిలో విమర్శన వ్యాసం ప్రవర్తిల్లుతుంది. విమర్శనం విమర్శనవ్యాసం మధ్య హద్దులు అస్థిరంగా ఉన్నాయి. విషయాధిక్యంవల్ల విమర్శనమేదో, విమర్శన వ్యాసమేదో నిర్ణయించటం జరిగింది. కట్టమంచి రామలింగారెడ్డి, 'కవిత్వతత్త్వ విచారము' విమర్శనంగా 'వ్యాసమంజరి' విమర్శనవ్యాస సంపుటిగా గ్రహింపవచ్చు. అంతకంటే స్పష్టమయిన విభజనగా కోరాడ రామకృష్ణయ్య 'ఆంధ్రభారత కవితా విమర్శనము' విమర్శనం, 'సారస్వతవ్యాసములు' విమర్శనవ్యాసాలుగా, భావింపవచ్చు.

తెలుగులో ఉన్న విమర్శన వ్యాసాలు ముప్పాతికవంతు సారస్వత విషయ విన్యస్తంగానే వున్నాయి. అయితే సారస్వతేతర విద్యా విషయాల



మీద ఇంత విస్తృతంగా వ్యాససృష్టి జరగలేదు. పరిపూర్ణంగా మానవాభ్యుదయం జరగటానికి ఏ విద్యారంగమూ మనిషికి దూరంగా ఉండకూడదు. ఏ అంశమయినా వ్యాసంగా రూపొందకపోతే ఆ అంశం విద్యావంతులకే తెలియలేదని అర్థం. రాకెట్టు నిర్మాణం శాస్త్రవేత్తకు తెలుస్తుంది. అది వ్యాసంగా వెలువడితే విద్యార్థులకు అవగతమవుతుంది. విజ్ఞాన వాహికగా మిక్కిలి సమర్థవంతమయిన విమర్శన వ్యాసం మానవ సంస్కృతి నాగరికతలకేకాదు, విజ్ఞాన వికాసాలకు కూడా కూడలికావటం వాంఛనీయ పరిణామం.

## 2:1. కావ్యతత్త్వవ్యాసం

ఒక కావ్యంలోని మూలతత్త్వం వివరించి, విపులీకరించి చూపటం, ఆ కావ్యం నిర్మితమయిన పునాది విశదీకరించి తెలపటం వంటి విమర్శనరీతి పూర్వం లేదు. తెలుగు సాహితీవిమర్శనంలో కావ్యతత్త్వం విశదంచేసే వ్యాసాలు తదితర వ్యాసాలుకంటే విమర్శకుడి సమ్యగ్దృష్టిని విస్పష్టంగా చూపి ఒక సమగ్రపథకం వెనుక వెలిగే మూలదీప్తిని ప్రదర్శించాయి.

ఒక కోవలోని విమర్శకులు సాధారణంగా కావ్యవాఙ్మయంలోని మూల తత్త్వం పరిశీలించే దృష్టికలిగి వుండటం సహజమే: ఆ దృష్టి వాళ్ళ విమర్శన వ్యాసవాఙ్మయాన్ని అనుశాసిస్తూ వుంటుంది. ఈ కోవలో కోరాడ రామకృష్ణయ్య, దువ్వూరి రామిరెడ్డి వంటివాళ్ళు విమర్శన వ్యాసాలు వ్రాశారు.

ఈ యుగంలో పిల్లలమర్రి హనుమంతరావు కావ్యతత్త్వవ్యాసాలతో పాటు కావ్యపాత్ర విమర్శన వ్యాసాలు, సాంఘికవ్యాసాలు వ్రాయటం జరిగింది. 'సాహిత్య సమాలోచనము' 'సాహిత్య సమీక్ష' 'మాధురీ మహిమ' 'సాహిత్య సంపద' 'ఇష్టాగోష్ఠి' సంపుటులలో రచయిత వ్యాససారస్వత కృషి గోచరమవుతుంది.

సాహిత్యం, కవి, విమర్శకుడు వంటి అంశాలకు సూత్రప్రాయ వివరణం; పదకవిత, ప్రబంధం, వచనం, రూపకంవంటి వాటి స్వరూపనిర్ణయం; ప్రాచీనాధునిక కావ్యప్రపంచంలోని రసమయ సన్నివేశాలకు, పాత్రల స్వరూప స్వభావాలకు, సుందర సమన్వయం; ఆంధ్రులు క్రియాసాధకులు కావాలన్న ఆసక్తి; ఈ వ్యాసగతంగా గోచరమవుతున్నాయి. ఇందులో స్థూలంగా మూల

సిద్ధాంత పరామర్శనుంచి ఆధునిక వాఙ్మయ సౌందర్యందాకా రచన ద్యోతకమవుతూవుంది.

డా॥ జి. వి. కృష్ణరావు 'కావ్యజగత్తు' 'నవతోరణం' లలో సాహిత్యం వ్యాకరణం రసం తత్త్వం అంశాలనుగూర్చి వ్యాసాలోచన చేయటం చూడవచ్చు.

శ్రీ విన్నకోట మాధవరావు 'కావ్యరీతులు' 'కావ్యాలోకన' 'కావ్య శిల్పము' లలో కావ్యతత్త్వ విమర్శనం జరిగింది. ప్రబంధ వాఙ్మయ పరిణామం; కవి, కవిత్వం, కావ్యంవంటి అంశాలు; కావ్యపాత్ర ప్రయోజనంవంటి విషయాలు ఈ వ్యాససృష్టిలో ఉన్నాయి. కావ్యజీవితం అన్ని దిక్కులనుంచి ఆలోచనకు గురిచేసి కావ్యసృష్టికి మూలధర్మాలు పరిశీలించటం ఈ రచయిత కృషిగా గమనింపవచ్చు.

శ్రీ ఆర్.యస్. సుదర్శనం 'సాహిత్యంలో దృక్పథాలు', 'సమాజము - సాహిత్యము' లలో నవలాప్రక్రియ తత్త్వం కొన్ని నవలల సిద్ధాంతపు పునాది దర్శించటం జరిగింది.

నేదునూరి గంగాధరం 'జానపదగేయవాఙ్మయ వ్యాసావళి', శ్రీ బండారు తమ్మయ 'వ్యాసావళి', శ్రీ వావిలాల సోమయాజులు 'మణిప్రవాళము' ఈ కోవలోని వ్యాసం సంపుటులు.

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, శ్రీ వి. అంకయ్య, శ్రీ గొఱ్ఱెపాటి వెంకటసుబ్బయ్య, శ్రీ క్రొవ్విడి రామం, శ్రీ పడలి మందేశ్వరరావు, శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి, శ్రీ పి.వి. సోమయాజి వంటి పలువురి వ్యాసాలు ఈ కావ్య తత్త్వ విమర్శన వ్యాసాలుగా ఉన్నాయి.

## 2:2. కావ్యాత్మ వ్యాసం

కావ్యతత్త్వ వ్యాసంలో అనేక కావ్యగత ప్రధాన తత్త్వైక్యం పరికిస్తే కావ్యాత్మ వ్యాసంలో ఒక ప్రత్యేక కావ్యలక్షణం దర్శించటం జరుగుతుంది. అది సమష్టినుంచి వ్యష్టిని సాధిస్తే ఇది వ్యష్టినుంచి సమష్టిని సాధిస్తుంది. కావ్యప్రధాన లక్ష్యం విశదీకరించే దృష్టితో సాగిన విమర్శన వ్యాసాన్ని కావ్యాత్మ వ్యాసంగా గ్రహించటమయింది. కావ్యాత్మ వ్యాసం తెలుగులో వ్యాసరచన మారంభమయిన



నాటినుంచి వెలువడుతూ వుంది. ఈ విధమయిన వ్యాససృష్టి వేదము వేంకటరాయశాస్త్రి, వెన్నేటి రామచంద్రరావు, బుర్రా శేషగిరిరావు వంటి పలువురు ప్రసిద్ధులు చేశారు.

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యుల 'మూడు కావ్యాలు (1952), 'సాహిత్య వ్యాసములు' లలో శిల్పసాహిత్యతత్త్వ వివరణాత్మక రచనముంది. ఈ కోవలో విమర్శన వ్యాసాలు ఆరంభంలో శబ్దదృష్టినీ ఆ పైన కావ్యాత్మదృష్టినీ పెంచుకొన్నాయి. సమగ్ర కావ్యతత్త్వచరిత్ర నిర్మించబడటానికి ప్రతికావ్య ప్రత్యేకత వివరించే కావ్యాత్మ వ్యాససృష్టి ఆవశ్యంగా ఉంది.

## 2:3. కావ్యగుణ వ్యాసం

కావ్యాత్మ వ్యాసం కావ్య స్వభావ ప్రధానంగా రూపొందితే కావ్యగుణ వ్యాసం కావ్యస్వరూప ప్రధానంగా సిద్ధించింది. ఈ వ్యాసాలలో కావ్యావసరాలు కావ్య శరీరంలోని సర్వభాగాలు వ్యష్టిగాను సమష్టిగాను పరిశీలనం పొందాయి. ఈ వ్యాసాలలో కావ్యగుణాన్ని విమర్శించటంలో సత్యాన్ని తప్ప వ్యక్తిగతాభిప్రాయానికిగానీ, హేతువుకు తప్ప ఇష్టా నిష్టాలకుగానీ, చోటు లేకపోవటం అవసరమే అయినా అది అవశ్యం పాటింపబడ్డ అంశంకాదు.

కావ్యధర్మాలు రచయితను ఏ విధంగా ఆకట్టుకొంటే ఆ ధర్మాలు కావ్య గుణ వ్యాసంలో ఆ విధంగానే ప్రవర్తిస్తాయి. అందువల్లే ఈ విమర్శన వ్యాసం పరిపూర్ణ సత్యంగా కానీ సంపూర్ణ హేతుయుతంగా కానీ ఉండదు. ప్రాచీన దశలోని ఈ స్థితి క్రమ క్రమంగా తగ్గిపోయి సత్యహిత సమాలోచనంగా ఈ కావ్యగుణ వ్యాసం ఆవిర్భవించింది.

శ్రీ ఆంధ్ర శేషగిరిరావు - ఆంధ్ర సారస్వత వ్యాసావళి (1952) కావ్య పాత్రల పరిశీలన సంపుటి. ఈ ఆలోచనలు సామాజిక పరిధీ ప్రవర్తకంగా ఉన్నాయి.

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి - సాహిత్యసమీక్ష (1956), ద్రోణ ప్రశస్తి (1960) కావ్యపాత్రగతమయిన వ్యాససృష్టితో ఉన్నాయి. పాఠపరిశీలనంగా పరిశోధనగా ఈ రచన సాగింది.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి-వ్యాసరత్నావళి భాషాసారస్వత వ్యాసా

లతో ఒప్పుతూ వుంది. విషయదృష్టి, విమర్శనాధిక్యం పాండిత్యశోభ హేతు దృష్టి ఈ వ్యాసాలను విమర్శన వ్యాసాలుగా రూపొందించాయి కానీ, కొంత సృజనగుణం రచనలలో లేకపోలేదు. సంస్కృతాంధ్రభాషా కావ్య సాంఘిక సంగతులు ఈ వ్యాసవిషయాలుగా ఏర్పడాయి.

శ్రీ బులుసు వేంకటేశ్వరులు-భారతీ వ్యాసములు (1955) లో కావ్యాల లోని కవితాగుణాలు, శ్రీ జాస్తి వెంకటనరసయ్య వ్యాసవాణి నాలుగు భాగాలలో ఆంధ్రజాతి కవిత వస్తువులుగా పరస్పర సంబంధం, పరిశీలన పొందాయి.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ వ్యాసాలు కొన్నింటిలో విమర్శన గుణం కంటే సృజనధర్మం, వస్తువుకంటే రచన ప్రధానంగా అనిపించినా అన్ని ప్రక్రియ లలో సిద్ధహస్తుడైన వ్యక్తి కావటంవల్ల, ఏ ప్రక్రియ ఎప్పుడు ఏ వస్తు రచనకు వాడుకోవాలో తెలిసిన రచయిత అయినందువల్ల, వ్యాసం విమర్శన ప్రక్రియగానే గ్రహించినట్లు గమనింపవచ్చు. నన్నయ ఆంధ్రీకరణమయినా, అల్లసాని అల్లిక జిగిబిగి అయినా, శాకుంతలము అభిజ్ఞానత అయినా విమర్శ వ్యాసాలుగానే అవతరించాయి. ఎమెస్కో సంప్రదాయ సాహితిగా వెలువడ్డ కావ్యాలకు వ్రాసిన పీఠికలు సృజన వ్యాసాలుగా ఉన్నాయి.

డా॥ దివాకర్ల వేంకటావధాని 'కావ్యలహరి' వ్యాసాలు అయిదు కావ్యాల సంపూర్ణ సౌందర్యం ప్రదర్శించేవిగా, డా॥ యస్వీ జోగారావు సప్తతంతువు, మహాకవి మార్గము (1965), సారస్వత నీరాజనము (1965) కావ్యగుణాలు సందర్శించేవిగా ఉన్నాయి.

డా॥ సి. నారాయణరెడ్డి వ్యాసవాహిని (1965) వ్యాసాలలో ప్రాచీనాధునిక కవితా ప్రపంచంలో వెలుగు కళికలుగా ప్రకాశించే కవుల కావ్యపాత్రల పరిశీలనం జరిగింది. విషయం విమర్శనంగా రచనం సృజనంగా చేసిన వ్యాసకర్త సవ్యసాచి. కవితాపరిధిని చేరుకొన్న వచనంవల్ల వ్యాసం కవిత్వంగా రూపం దిద్దుకొంది. ఈ వ్యాసాలు కావ్యగుణ వ్యాసస్థాయిని ఇనుమడింపజేశాయి.

డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి - నైమిశము, సమీక్షణ కావ్యగుణపరిశీలన చేసిన వ్యాససంపుటులు. సాహిత్యం పట్ల రచయితకున్న భక్తిప్రపత్తులకు ఈ సాహిత్యం నిదర్శనంగా ఉంది. డా॥ తిమ్మావజ్ఝల కోదండరామయ్య - తెనుఁగుమఱుఁగులు, కళాపూర్ణోదయ ప్రశంస; డా॥ జె. సూర్యనారాయణ -



వ్యాసరాజి (1969); డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం - సారస్వతసౌరభము (1970); శ్రీ కాఘారి హనుమంతరావు - సాహితీజగతి (1970); శ్రీ ఆవంత్స వేంకట రంగారావు - వ్యాసావళి, శ్రీ వంతరాల రామకృష్ణరావు - వ్యాసమంజరి, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య షట్పది - వ్యాసమంజరి కావ్యగుణ విమర్శ నంతో సాగిన వ్యాసాలకు నిలయాలు.

ఈ కావ్యగుణ వ్యాససృష్టిచేసిన వాళ్ళలో అధిక సంఖ్యాకులు విశ్వవిద్యా లయాలలో కళాశాలల్లో ఉపన్యాసకులు. ఒకకావ్యం-సన్నివేశం-రసమయంగా గ్రహించటానికి ఇటువంటి వ్యాససృష్టి దోహదం చేసింది. వీటి విస్తృతి కావ్య విమర్శనంలో ఉండవలసిన దృష్టిని పెంచుతుంది.

## 2:4. కవ్యాత్మవ్యాసం

ఈ వ్యాసం కవి ఆత్మను విశదం చేస్తుంది. ఇందులో కవి ప్రాధాన్యం ఉంటుంది. ఒక కవి రచనలన్నింటిలో అభివ్యక్తమయ్యే కవి ఆత్మకాని, ఒక కావ్యంలోని కవి ఆత్మదీప్తికాని గ్రహించటానికీ, ప్రదర్శించటానికీ ఈ వ్యాసం అనుకూలంగా ఉంది. ఒక కవి తను చెప్పుకొన్న కవితాధర్మాలకు అనుగుణంగా కావ్యసృష్టిచేశాడో చేయలేదో ఈ వ్యాసం పరిశీలిస్తుంది. అందువల్ల సారస్వత జీవి అయిన కవి వ్యక్తిత్వానికి పరిమితంగా జరిగిన వ్యాససృష్టిని కవ్యాత్మ వ్యాస వాఙ్మయంగా గుర్తించవచ్చు.

కావ్యవస్తువు, భాష, ఛందస్సు, ప్రక్రియ ఎన్నుకోవటంలో కొంతవరకు కవితత్త్వం తెలుస్తుంది. తెలుగులో ఒకకవి కవితా పరిశీలనంగా అనేక విమర్శన గ్రంథాలు అవతరించాయికాని వ్యాసాలు ఎక్కువగా వెలువడలేదు.

శ్రీ దేవులపల్లి రామానుజరావు-సారస్వత నవనీతము (1955) వ్యాస మంజూష (1956) ప్రధానంగా కవ్యాత్మ సుస్పష్టంచేసే వ్యాసాలు. వీటిలో కావ్యతత్త్వ, కావ్యాత్మ వ్యాససముదాయం ఉంది కాని ప్రముఖంగా కవ్యాత్మ వ్యాసాలు ఎక్కువ.

ఈ వ్యాసకర్తకున్న ఆంధ్రత్వంమీద అభిమానం, సారస్వతంపట్ల ప్రేమ ఈ రచనలలో చూడవచ్చు. తెలుగుదనం గౌరవింపబడాలని, తెలుగుసారస్వతం విస్తృతంగా వ్యాపించాలని రచయితకున్న వాంఛ వ్యాససాహిత్యంలో విశదంగా

గోచరమవుతుంది. కవి పరిచయమయినా, పాత్రపరిశీలనమయినా, కావ్య పరిశోధనమయినా రచనం సృజనంగా చేయటంలో వ్యాసకర్త సాహితీ దక్షత కనిపిస్తుంది. వ్యాసంలో వస్తుతత్త్వం అలవోకగా గ్రహించి విశదీకరించి వ్యాసంగా సృష్టించేనేర్పు గమనింపవచ్చు.

శ్రీ దేవులపల్లి రామానుజరావు వ్యాసవాఙ్మయంలో క్షేత్రయ్య నాయికలే కాదు, మునిమాణిక్యం కాంతం పాత్రసృష్టికి హేతువయిన మూలచైతన్యం దర్శించటం జరిగింది; కందుకూరి, కొమఱ్ఱాజు, గురజాడ, ముట్నూరి, కట్టమంచి, క్షేత్రయ్య, పోతన, ముద్దుపళిని తమ సాహిత్యంలో నిక్షిప్తం చేసిన హృదయం పరిశీలనం పొందింది; ఇంకా చిలకమర్తి, చెళ్ళపిళ్ళ, సురవరం, రాయప్రోలు, దేవులపల్లి కృష్ణశాస్త్రి సాహిత్యసమాలోచనం కూడా ఈ వ్యాసగతంగా గోచరమయింది. ఇంత విస్తృతంగా కవ్యాత్మ వ్యాససృష్టి చేసిన వ్యాసకర్తలు ఇంకా లభించవలసి వున్నారు.

ఇంతమాత్రమే కాక, ఆంధ్రవాఙ్మయంలో ప్రకృతిచిత్రణం, వీరరస ప్రాధాన్యం జానపద సాహిత్య తత్త్వం విశదీకరించిన కావ్యతత్త్వ వ్యాసాలు; కళాపూర్ణోదయంలో శృంగారాత్మ, వేయిపడగలులో భావప్రేరకత తెలిపిన కావ్యగుణ వ్యాసాలు ఉన్నాయి.

తెలంగాణాలో వచ్చిన సారస్వతచైతన్యం, దేశచరిత్ర సారస్వతాభివృద్ధులకు ముడిపడిఉన్నదనటానికి నిదర్శనంగా వ్యాసకర్త ఆ విషయం అక్షరరూపంగా చేయటం జరిగింది. ఈ వ్యాసాలలో ప్రాచీనాంధ్రసాహిత్యంతో పాటు ఆధునికాంధ్ర కవులను పరిచయం చేయటం చూడవచ్చు. కొన్ని వ్యాసాలు వివరణాత్మకంగా, కొన్ని సమీక్షాప్రాయంగా ఉన్నాయి. ఆరంభంలోని గ్రాంథిక భాష అనంతరంలో వ్యావహారికంగా మారింది. తెలుగు భాషకు, తెలుగు కవిలోకానికి సాహిత్యంగానూ, తదన్యంగానూ ఆర్థికంగా హార్దికంగా ఆంతరబాహిర దోహదం చేసే సాహితీమూర్తి శ్రీ దేవులపల్లి రామానుజరావు.

డా॥ బి. రామరాజు జానపదవాఙ్మయ వ్యాసావళి (1960) మరుగున పడిన మాణిక్యాలు (1961) వ్యాససంపుటులలో సాహితీ గౌరవం పొందని విస్మృతాంధ్ర కవులను, కవితను ఆంధ్రులకు అందించటంగా రచన సాగింది. అనాదృత వాఙ్మయానికి అలక్షిత కవిప్రపంచానికి ఈ వ్యాససృష్టి నవోదయం.



సంస్కృతి సారస్వతాల సందర్శనంగా ఉన్న కవి జీవితాలకు కాంతి ప్రసాదించిన ఈ వ్యాస సాహిత్యం సారస్వత చైతన్యానికి ప్రతీక.

డా॥ చల్లా రాధాకృష్ణశర్మ 'తెనుగు విందు' లో ప్రాచీన కవులతోపాటు తెలుగులో కృషిచేసిన ఆంగ్లేయుల సాహితీ జీవితం పరిశీలించటం జరిగింది. శ్రీ కేశవపంతులు నరసింహశాస్త్రి 'ప్రబంధ పాత్రలు' కవిదృష్టి విశేషించే వ్యాస సంపుటి. కవ్యాత్మ వ్యాససృష్టి తెలుగువాఙ్మయంలో విస్తృతంగా జరగవలసిఉంది.

## 2:5. కావ్యచరిత్రవ్యాసం

కావ్యచరిత్ర సంపూర్ణ విమర్శనంగా ఎక్కువగా వెలువడింది. వ్యాసంగా అంతఎక్కువగా వెలువడలేదు. చరిత్ర ఏదయినా, -కవి చరిత్రగాని, వాఙ్మయ చరిత్రకాని, ప్రక్రియా చరిత్రకాని- వస్తుగుణంలోనే వ్యాసంగా అవతరించే దశకు అతీతంగా ఉంది. కవిచరిత్ర కంటే ఎక్కువగా చారిత్రక జీవితాల చరిత్ర వ్యాస వాఙ్మయంలో ప్రవేశించింది కాని కావ్యచరిత్రమాత్రంకాదు. శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి 'ఆంధ్ర రచయితలు' కానీ, శ్రీమతి ఊటుకూరి లక్ష్మి కాంతమ్మ 'ఆంధ్ర కవయిత్రులు' కానీ విశాలప్రణాళికకు పరిమితంగా ఉన్నాయి. చరిత్రలుగా రూపొందాయి కాని చారిత్రక వ్యాసాలుగా వెలయలేదు. ప్రాచీనులు కావ్యచరిత్ర వ్యాససృష్టి చేశారుకాని ఆధునికులలో ఈ వ్యాసం అంతఎక్కువగా వెలువడలేదు.

అభ్యుదయకవులు తమ కవితాధిక్యం ప్రకటించినప్పుడు, దిగంబరకవులు తమ కవితా వైశిష్ట్యం వివరించినప్పుడు విరసం తమ సంస్థ-సాహిత్య లక్ష్యాలు ప్రకటించినప్పుడు, వెలువడ్డ వ్యాసాలు కావ్యచరిత్ర వ్యాసాలుగా గోచరమయ్యాయి. ఇటువంటి వ్యాససృష్టిలో శ్రీ కె. వి. రమణారెడ్డి, శ్రీ జ్వాలాముఖి శ్రీ త్రిపురనేని మధుసూదనరావు ప్రముఖంగా కనబడుతున్నారు.

## 2:6. జీవితచరిత్ర వ్యాసం

ప్రతివ్యక్తి జీవితం ఒక ప్రధానశక్తిని లోకానికి దానం చేస్తుంది. అది సమాజానికి ఉపయోగపడిందాన్ని బట్టి దాని విలువ నిర్ణయింపబడుతుంది. విలువైన జీవితచరిత్ర వ్యాసంగా భవిష్యదుపయోగార్థం అవతరిస్తుంది. మునుపు

అటువంటి వ్యాసాలు అనేకం తెలుగు సారస్వతంలో భాగంగా ఉన్నాయి. నేడు అవి అంత ఎక్కువగా వెలువడటంలేదు. జీవితచరిత్ర అయితే విమర్శన వ్యాసంగా రూపొందుతుంది కాని ఆత్మచరిత్ర అయితే సృజన వ్యాసంగా వెలువడుతుంది.

సాంఘిక జీవితం పునీతం చేసేవాళ్ళు కొందరయితే సారస్వత జీవితం సంపన్నం కావించేవాళ్ళు మరికొందరు. శ్రీ దంటు కృష్ణమూర్తి భారతరత్నాలు (1963) రాజకీయంగా సాంఘికంగా ప్రసిద్ధులయిన రాజేంద్రప్రసాద్, నెహ్రూ, కార్వే వంటి ప్రముఖులు సాధించిన అభ్యుదయం వివరించే వ్యాసాల సంపుటి.

శ్రీ కె.వి. రమణారెడ్డి - 'శరత్‌బాబు' జీవిత సాహిత్యాల పరిచయం చేసిన వ్యాసం, శ్రీ జాస్తి వెంకటనరసయ్య - 'నార్ల వేంకటేశ్వరరావు (1963) సాహితీజీవి పరిచయంగా ఉన్న వ్యాసం. జీవితచరిత్ర వ్యాసాలు అధికంగా వెలువడటం వాంఛింపవలసిన అంశం.

## 2:7. భాషావ్యాసం

ఆధునిక భాషాశాస్త్రం తెలుగు భాష వ్యక్తిత్వాన్ని నూత్న కోణంనుంచి చూపించింది. తెలుగులో సారస్వత దృష్టి ఉన్నంతగా భాషాదృష్టి లేకపోవటం చింత్యం. తెలుగు సంస్కృతజన్యమా కాదా అన్నది ఇప్పుడు సమస్య కాదు. భాషా వ్యాసాలు పూర్వంకంటే ఎక్కువగా ఇప్పుడే వెలువడుతున్నాయి.

ఈ యుగంలో కొత్తపల్లి రంగారావు - 'భాషాశాస్త్ర మూలసూత్రాలు' (1955) భాషా సిద్ధాంతాలు చెప్పేదిగా ఉంది. శ్రీ బి.సి. బంగారయ్య 'తెలుగా ఆంధ్రమా' (1963) నుడి-నానుడి (1965) సంస్కృత ప్రభావానికి దూరంగా తెలుగు ఉండాలన్న వాంఛనుంచి పుట్టిన వ్యాసాలు.

భాషా వ్యాసాలు వ్రాసిన అనేకులకు తోడుగా మునుపు జరిగిన గ్రాంథిక వ్యావహారిక భాషా సంగ్రామం భాషా వ్యాససృష్టికి మార్గం ఏర్పరచింది. విశ్వ విద్యాలయాలలో పనిచేసే డా॥ భద్రిరాజు కృష్ణమూర్తి, డా॥ జి.యన్. రెడ్డి, డా॥ కె. మహదేవశాస్త్రి, డా॥ తూమాటి దొణప్ప, డా॥ చేకూరి రామారావు, డా॥ లకంసాని చక్రధరరావు, డా॥ కె. నాగభూషణరావు వంటి పలువురు భాషావ్యాసాలు వ్రాస్తున్నారు. విశ్వవిద్యాలయాలతో నిమిత్తం లేనివాళ్ళు



శ్రీ తిరుమల రామచంద్ర వంటి వాళ్ళు ఎక్కడో చెదురుమదురుగా భాషావ్యాస సృష్టి చేస్తున్నారు. తెలుగు భాషావ్యాసం భాషా సారస్వతాలు సుసంపన్నం కావటానికి అధికంగా వెలువడవలసి వున్నాయి.

## 2:8. అన్యభాషావ్యాసం

ఇతర భాషాసారస్వత సంప్రదాయాలు తెలియటానికి వీలుగా తెలుగులో అన్యభాషా వ్యాసం అవతరించింది. సంస్కృతం, హిందీ, ఉరుదూ, పారసీ భాషలలోని సారస్వతం వివరించే వ్యాసాలు తెలుగులో వెలువడ్డాయి.

శ్రీ జటావల్లభుల పురుషోత్తము- భారతీయ వైభవము (1951) శ్రీ తిరుమల శ్రీనివాసశర్మ-వేదవాఙ్మయము (1953), సంస్కృత సాహిత్యం, ఆర్యుల నివాసం, వేదకాల సాంఘిక జీవితంవంటి అనేక సంస్కృత సారస్వతాంతర సత్యాలు వివరించే వ్యాసాల సంపుటాలు.

శ్రీ నల్లాన్ చక్రవర్తుల వేంకటాచార్యులు- 'అమరవాణి వ్యాసాలు' శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి సంకలనం చేసిన 'అమరవాణీ ప్రసారములు' శ్రీ యస్. సి. యస్. వేంకటాచార్యుల అమరవాణి (1968) సంపుటాలలోని వ్యాసాలు ఆకాశవాణి ప్రసారం చేసింది. ఇది సంస్కృత సారస్వత సంబంధి వ్యాసాలు.

శ్రీ జి. సుందరరెడ్డి- 'వెలుగుదారులు' హిందీ సారస్వతంలోని సంప్రదాయాలు కవితారీతులు పరిచయం కావించాయి. డా॥ బయ్యా సూర్యనారాయణ ఆలోచనామృతము (1970) ఆధునిక హిందీ సాహిత్యాలోచనలుగా ఉన్న వ్యాస సంపుటి. డా॥ బాలశౌరిరెడ్డి, డా॥ జె. విశ్వమిత్ర హిందీ సారస్వత విషయ ప్రముఖంగా తెలుగులో వ్యాససృష్టి కావించారు.

బూర్గుల రామకృష్ణరావు 'సారస్వత వ్యాసముక్తావళి' ఉరుదూ పారసీ కవితారీతులు ఆంధ్రులకు సరసంగా పరిచయం కావించిన సారస్వత విమర్శన వ్యాససంపుటి.

## 2:9. అనువాదవ్యాసం

అన్యభాషలనుంచి తెలుగులోకి అనువదింపబడ్డ వ్యాసాలు ఆయా మూల

సారస్వతాలలో సృజనమయినా విమర్శనమయినా అవి ఆంధ్రంలోకి రావటంలో జరిగిన కృషి విమర్శన సహితం కాబట్టి అవి విమర్శన వ్యాసాలే : ఈ వ్యాసాల వల్ల అన్యభాషలతో పరిచయం లేనివాళ్ళకు ఆ సాహితీ ధర్మాలు తెలియనివాళ్లకు విజ్ఞాన లాభం కలుగుతుంది. ఆ యా భాషలలోని వ్యాస లక్షణాలు తెలిసే అవకాశం ఉంది. ఆ భాషల్లో వ్యాస విషయం రచనా ధోరణి సాహితీ సంప్రదాయాలు అర్థమయ్యే స్థితి వుంది.

ఆంగ్లంలో నుంచి తెలుగులోకి 1900 నుంచి వ్యాసానువాదాలు వచ్చాయి. ఈ యుగంలో అరవిందరవీంద్రుల ఆంగ్లమూలంనుంచి డా॥ బొడ్డుపల్లి పురుషోత్తము - 'కాళిదాసకవిత'; రాయ్ వ్యాసాలు; శ్రీ కె. రాధాకృష్ణమూర్తి-అజయ్ కుమార్ ఘోష్ వ్యాసాలు; నెహ్రూ ఉపన్యాసాలు వంటివి అనేకం వెలువడ్డాయి.

వేమనను గూర్చి ఆంగ్లంలో అనేకులు వ్రాసిన వ్యాసాలు శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి అనువదించి 'వేమన-పాశ్చాత్యులు' అని ప్రచురించటం జరిగింది. దీని అనువాదం అసలు రచన అన్నంత ఉన్నతంగా జరిగింది. వేమనకవిత పట్ల ఆంగ్లేయు లెంత మమకారం పెంచుకొన్నారో ఈ వ్యాససంపుటి చదివితే విశదమవుతుంది.

బెంగాలీ, హిందీ, కన్నడ భాషలలోని వ్యాసాలు తెలుగులోకి అనువదింపబడ్డాయి. 'రవీంద్ర వ్యాసావళి' శ్రీ రాయప్రోలు సుబ్బారావు శ్రీ మల్లపరపు విశ్వేశ్వరరావులు అనువదించగా రెండు సంపుటాలుగా వెలువడింది. రవీంద్ర వ్యాస సాహిత్యం అనేకులు కొంతకొంతగా అనువదించారు. శరత్ వ్యాసాలు నన్నపనేని సుబ్బారావు అనువదించటం జరిగింది.

హిందీనుంచి ఈ యుగంలోనూ అనేక వ్యాసానువాదాలు వచ్చాయి. ప్రేమ్‌చంద్ - 'సాహిత్యము-ఉద్దేశము' (1966) విశాలాంధ్ర ప్రచురణాలయం ముద్రించింది. మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్ లేఖా వ్యాసాలు - 'తలపుల దుమారము' (1969) శ్రీ దేవులపల్లి రామానుజరావు అనువాదమయి వెలువడింది.

గోరూరు రామస్వామి అయ్యంగార్ కన్నడంతో సంకలనంగా రూపొందించిన వ్యాససంపుటి శ్రీ తిరుమల రామచంద్ర అనువాదంగా తెలుగులో ప్రవేశించి,



వ్యాససృజన లక్షణం వివరించేంత సమర్థంగా ఉంది. ఈ అనువాద వ్యాసాలు తెలుగు వ్యాస దృష్టిని విశాలం కావించాయి.

## 2:10. పీఠికావ్యాసం

ఆధునిక యుగంలో సాధారణంగా కావ్యకన్య పీఠికా తిలకం అలంకరించుకొని జనంలోకి వస్తూవుంది. పీఠికలు వ్యాసాలుగా ముద్రించటం జరిగింది. అవి వ్యాస లక్షణ సమంచితాలుగా ఉండటంవల్లనూ ఆంగ్లంలో ఆ విధంగా జరగటంవల్లనూ అది తెలుగు సంప్రదాయమయింది. ఆరంభంలోని పీఠికా వ్యాస ధర్మం విమర్శనంగా ఉండేది. నేటి పీఠికలు సృజనధర్మం నిలుపుకొంటున్నాయి.

నాగపూడి కుప్పుసామయ్య, తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్యల పీఠికలు పూర్వం వ్యాసాలుగానే గ్రహింపబడ్డాయి. కట్టమంచి పింగళి పీఠికలే వ్యాసాలుగా వెలువరించారు. కవులు రచయితలతో పాటు ప్రచురణకర్తలు కూడా పీఠికలు వ్రాయించుకొని ఈ విధమైన వ్యాసరచనకు ప్రోత్సాహం కలిగిస్తున్నారు. నేడు వెలువడే అనేక గ్రంథాలు పీఠికా వ్యాస శోభితాలుగా ఉన్నాయి.

## 2:11. వేదాంత వ్యాసం

ఆంధ్రదేశంలోని ప్రతిమతం ఆ మతధర్మాలు, మత వేదాంతం ప్రచారం చేసుకొనే పత్రికలు పూర్వం ఎక్కువగా, నేడు తక్కువగా నడుపుకోవటం జరిగింది. వేదాంతం ప్రచారంచేయటానికి వ్యాసం గ్రహింపబడింది. మతగురువులు పీఠాధిపతులు వేదాంత వ్యాస ప్రోత్సాహకారకులయ్యారు.

కోలాచలం శ్రీనివాసరావు అనేక వేదాంతవ్యాసాలు సులభసుందర భాషలో వ్రాయటం తెలుగువాళ్ళకు సుపరిచితమే : వేలూరి శివరామశాస్త్రి ఏవం విధమైన వ్యాససృష్టి చేయటం జరిగింది.

అనేక మత పత్రికలలో వేదాంతవ్యాసాలు వెలువడినా ప్రచార పరిధిని దాటటంలేదు. కొన్ని సారిస్వత స్థాయిని అందుకొంటున్నాయి. ఈ యుగంలోని జీవితవేగం మతవేదాంత వ్యాసరచనకు అవకాశం కలగకుండా చేసింది.

## 2:12. వైజ్ఞానిక వ్యాసం

విజ్ఞానశాస్త్రం మానవుడి ఆధునికతా పథగమనానికి ప్రబలకారణమయింది. అది మనోవాక్కాయ కర్మలలో మార్పుతెచ్చింది. పూర్వం సమాధానం సక్రమంగా లభించని అనేకాంశాలకు విజ్ఞానశాస్త్రం సమాధానమయింది. ఈ దృష్టితో ఆంగ్ల విద్యారంభం నుంచి అనేక వ్యాసాలు వెలువడ్డాయి.

ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ వంటి వాళ్ళు వైజ్ఞానిక వ్యాసాలు మునుపు వ్రాశారు. వర్తమానంలో శ్రీ యం.యస్. శాస్త్రి 'సాహిత్యంలో సర్పం' (1953) 'సాహిత్యంలో జంతుజాలం' వంటి జంతుశాస్త్ర వ్యాసాలు, శ్రీ విస్సా అప్పారావు ఖగోళశాస్త్ర సంబంధి వ్యాసాలు వ్రాయటం జరిగింది. తెలుగులో సర్వశాస్త్రాలు పఠించటం ప్రారంభమయిన ఈ యుగం ఉత్తమ వైజ్ఞానిక వ్యాససృష్టికి తగిన సమాజ నేపథ్యం ఏర్పరచినట్లు గుర్తింపవచ్చు.

## 2:13. రాజకీయ వ్యాసం

దేశ రాజకీయ వాతావరణం సారస్వతంలోకి వచ్చింది. పత్రికలు కొన్ని రాజకీయాల ఊపిరితో బ్రతుకుతున్నాయి. నేటి పత్రికావ్యాసాలు కొన్ని రాజకీయ దృక్పథం వివరించేవిగా సాగుతున్నాయి. రాజకీయ పక్షాలు ప్రచురణాలయాలు స్థాపించి ఆ వ్యాససాహిత్యం పెంచుతున్నాయి.

రష్యా చైనా రాజకీయాలు, అమెరికా రాజకీయ దృక్పథం, రాయిస్టుల రాజకీయ చైతన్యం దేశంలోని విభిన్న రాజకీయ వర్గాలు ఈ వ్యాసరచనకు దోహదం చేశాయి. ఆయా పక్షాల సిద్ధాంతాలు ప్రచారం చేసుకోవటానికి ఇతర పక్షాల సిద్ధాంతాలు ఖండించటానికి తెలుగు వ్యాస ముపయోగపడింది.

## 2:14. ఆర్థిక వ్యాసం

తెలుగులో ఇంతవరకు జరిగిన ఆర్థికవ్యాస సృష్టి చాలా తక్కువ. స్వాతంత్ర్యం వచ్చిం తరవాత ఆర్థిక స్థిరత లభించి అది సుస్థిరమవుతున్న ఈ దేశంలో ఆర్థికవ్యాస వాఙ్మయం అధికంగా వెలువడే స్థితివుంది.



మామిడిపూడి వెంకటరంగయ్య వంటి ప్రముఖుల ఆర్థికవ్యాసాలు పూర్వం వచ్చాయి. శ్రీ గోరా 'ఆర్థిక సమానత- ప్రజాస్వామికము' వ్యాసం ప్రజలు ఆర్థిక సమానతకోసం చేయవలసిన కార్యక్రమాలు వివరించింది. భారతిలో శ్రీ బులుసు వెంకట సుబ్బారావు అనేక ఆర్థిక వ్యాసాలు ప్రచురించటం జరిగింది. వాణిజ్య వ్యాపారపత్రికలలో ఆర్థికవ్యాసం సారస్వతస్థాయిని పొందుతుంది. భారతి, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలలో పరిశ్రమలమీద వ్యాసాలు వెలువడుతున్నాయి, ఆర్థిక వాతావరణం వివరించే వ్యాససృష్టి జరుగుతూవుంది.

## 2:15. పరిశోధన వ్యాసం

విమర్శనమేకాక పరిశోధనం కూడా వ్యాసంపేరుతో పిలవబడటం తెలుగు సారస్వతంలో సంభవించింది. పరిశోధన వ్యాసాలు నిజంగా వ్యాసాలు కాక పోయినా ఆ పేరును పెట్టుకొన్నాయి. అయితే పరిశోధన వ్యాసాలుకాకుండా, పరిశోధకుల వ్యాసాలు కొన్ని వెలువడ్డాయి. పరిశోధకులు చిన్న పరిధికి పరిమితంగా చేసిన పరిశోధన ఫలితాలు వ్యాసాలుగా ప్రచురించారు. అనేకులు అవి వ్యాససంపుటులుగా వెలువరించవలసివుంది.

డా॥ తూమాటి దొణప్ప భాషా సారస్వతకృషిలో ఉత్తమ ఫలితాలు సాధించిన విషయం విజ్ఞులకు సుపరిచితమే; 'భాషా చారిత్రక వ్యాసావళి' (1972) 'తెలుగులో కొత్త వెలుగులు' (1972) భాషాదృష్టితో వెలువడ్డ వ్యాస సంపుటాలు. రెండు సంపుటాలలో శబ్దదృష్టి భాషాశాస్త్రదృక్పథం గోచరమవుతూ వున్నాయి. తెలుగులో ఉన్న అన్యదేశ్యాలమీద ఆలోచన పాండితీ ప్రకర్షకు ప్రబలతార్కాణంగా ఉంది. 'భాషా చారిత్రక వ్యాసావళి' లో తీక్ష్ణసూక్ష్మ పరిశోధనదృష్టి 'తెలుగులో కొత్త వెలుగులు' లో సృజనసామర్థ్యం రచయిత బుద్ధి హృదయాలకు గీటురాళ్ళుగా ఉన్నాయి. భాషాశాస్త్రదృష్టితో ఈ వ్యాసాలు ఆధికారిక రచనలుగా సమగ్రపరిశోధనలుగా వున్నాయి.

డా॥ లంకసాని చక్రధరరావు 'భాషాశాస్త్ర వ్యాసములు' భాషాశాస్త్ర ధర్మాలు వివరించే వ్యాససంపుటి. విశ్వవిద్యాలయాలలో సారస్వత పరిశోధన ఫలితాలు వ్యాసాలుగా అందించిన పలువురి వ్యాససారస్వతం పూర్వభాగాలలో ప్రసక్తమయింది.

శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ- 'భారతీయసంస్కృతి' (1968)

సంస్కృతి లక్షణాలు నిరూపించే అయిదువ్యాసాల సంపుటి. ఖద్దరు పరిశ్రమను ప్రోత్సహించే వ్యాసావళి (1951) ని ఈ రచయిత ప్రచురించటం జరిగింది. కల్లూరి చంద్రమౌళి- భారతీయ ప్రతిభ (1950) దేశసంస్కృతి నాగరికతల పరిశీలన వ్యాససంపుటి. కృత్తివాస తీర్థుల 'వ్యాసవింశతి' శిల్పం చిత్రలేఖనం వివరించిన వ్యాససంపుటి.

ఈ యుగంలో తెలుగువ్యాసం పలువురు మహానుభావుల కమనీయ సారస్వత తేజంగా వ్యాపించింది. తెలుగులో సృజన విమర్శన వ్యాసరీతులు సారస్వతాన్ని ముఖ్యంగా వచన సాహిత్యాన్ని ప్రకాశవంతంగా వెలిగించాయి.

తెలుగువాళ్ళు ప్రాథమికంగా హృదయవాదులు. పరిణతంగా బుద్ధివాదులు. ఈ యుగంలో దేశజీవితంలో ఆలోచనానుభూతుల పరిధి విస్తృతమవుతూవుంది. సమాజం హృదయం వైపునుంచి బుద్ధివైపు పయనించే స్థితిలోవుంది.

మనిషికి జీవితమయిన ఆలోచనానుభూతులకు వ్యాసంలో ఉన్నంత అవ కాశం ఇతర సారస్వత ప్రక్రియలలో లేదనవచ్చు. తెలుగులో సృజనవ్యాసం పొందినంత గుణరచన విషయనిర్మాణ వైవిధ్యం విమర్శన వ్యాసం పొందలేదు. విమర్శనవ్యాసం వ్యాపించినంత విస్తృతంగా సృజనవ్యాసం వ్యాపించలేదు. ఈ యుగం రాబోయే తరంలో ఏ లోపంలేని సృజన విమర్శన వ్యాసరీతులు చూడ టానికి సంసిద్ధంగా ఉంది.

పూర్వం కంటే నేడు వ్యాసరచనావకాశం రచనావసరం రచనాదృష్టి పెరిగాయి. ఈ తరుణంలో వ్యాససృష్టికి కొత్తపథాలు కాంతిమంతమవుతాయి.

శతాధిక మేధావుల హృదయతేజం బుద్ధిబలం గ్రహించి రచనా ప్రక్రి యగా స్థిరరూపం పొందింది వ్యాసం. మనిషి సర్వాలోచనలకు మహితవాహికగా వ్యాసం ప్రసిద్ధమయింది. వ్యాసం ఆనందం కలిగించినా విషయం వివరించినా సాహిత్యం విమర్శించినా కొత్త భావాలు తెలిపినా సంఘసంస్కరణ కృషిచేసినా ప్రాథమికంగా మనిషిచుట్టూ ఆవృతమయింది. మనిషిని సంఘజీవిగా అక్షరాలా పరికించింది. వ్యాసం సాంఘిక జీవితానికి వ్యాఖ్యానం. సామాన్యుడి వ్యక్తిత్వానికి స్థానంఏర్పడ్డ ఈ సారస్వత ప్రజాస్వామికంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలలో మానవుడి అస్తిత్వం గౌరవింపబడుతున్న సమయంలో బుద్ధివికాసం తప్పనిసరి పరిణామం. వ్యాసం ఉత్కృష్టస్థాయిలో వెలువడటానికి ఈ దేశం అనుకూలంగా ఉన్న శుభవేదిక.

